# కుమార శతకము

గ్రంథకర్త

మునగపాటి చిన హనుమయ్య.

# శ్రీ కామాక్షి శతకము.

గ్రంథకర్త

మునగపాటి చిన హనుమయ్య.

శ్రీ శోభనాద్రి ముద్రాక్షరశాలయందు ముద్రింపబడెను.
గుంటూరు.
1925.
వెల 0-1-6.

# అంకితము.

క॥ జనని జనకుల విధమున
నను కృపగను చిన్నతండ్రి • నరసింహాఖ్యుఁ
జననికి సౌభాగ్యమ్మకు
వినతులతో నొసగినాడ • నీ యంకితముఁ॥

ఇట్లు,

గ్రంథకర్త.



# కుమార శతకము



శ్రీ మద్భక్తజనమనో
ధాముని సత్యస్వరూపు ♦ ధారుణికరుణా
ధాముని నిశ్చితు నాత్మా
రాముని సేవింపుమనవ ♦ రతము కుమారా

క॥ పరమేశుఁ గొలుచునప్పుడు
పరుభాషల వినెడునప్పుడు ♦ పలికెడునపుడున్
గరిమలర జదువునప్పుడు
స్థిరచిత్తముతో మెలంగ ♦ జెల్లు కుమారా.

క॥ భజియింపుము పరమాత్ముని
భుజియింపుము సాత్వికములు ♦ భోజనమును వే
గ జయింపు మింద్రియంబుల
త్యజియింపుము దుష్టమైత్రి ♦ తతుల కుమారా

క॥ బాలత్వమందు దుర్గుణ
పాలితుడై మదిగణించు ♦ భవ్యతకంటెన్
బాలత్వమందు సద్గుణ
శీలతగడియించి పెంప ♦ జెల్లు కుమారా! ౧౨

క॥ ఘనతలభించిన కొలదిని
వినయము వహియించి మహిని ♦ విహరింపదగున్
ఘనతర ఫలవృక్షంబులు
గనసిలకై వ్రాలియుండు ♦ గతిని కుమారా! ౧౩

క॥ మనమునగల భావములను
వినయముతో బొల్కుచో ♦ వివరించుచు నీ
వనినది యన్న తెలుగున
ననయము నేయుటయె నత్యమగును కుమారా! ౧౪

క॥ ఎప్పుడు కల్లలబల్కకుమీ
యెప్పుడు సూనృతమె జెప్పి ♦ యెప్పటికి జనం
బొప్పుదు నీవాక్యంబుల
నెప్పుడు సూనృతమ్ములంచు ♦ దలచి కుమారా! ౧౫

క॥ పరపతికి హానికలిగిన
నరపతికిని జరుగదొక క్షణంబును జనముల్
పరపతిని విల్వగొనవలె
నిరతము సత్యంబువలన నేర్చి కుమారా॥ ౧౬

క॥ సత్యంబే సకలార్థము
సత్యంబే సర్వధర్మ సంబోధకమౌ
సత్యంబు ముక్తిమార్గము
సత్యంబునకన్నలేదు జగతి కుమారా॥ ౧౭

క॥ సత్యవ్రతుండు స్తుత్యుడు
సత్యవ్రతుడఖిలసుగుణ సంపత్యుతుడౌ
సత్యవ్రతుడగు సదయుడు
సత్యవ్రతమే వ్రతంబు జగతి కుమారా॥ ౧౮

క॥ భూషణమగు చేదానము
భూషణమగునొక్కొ హేమ భూషలు విద్యా
భూషణము భూషణంబే
భూషణరాజంబు "శాంతబుద్ధి" కుమారా॥ ౧౯

క॥ ధనదాన మొసగుకంటెను
ఘనవానశాలలువలినుట కాంచిననట్టు పై
ఘనమన్న దానమొసగుట
ఘనము "నిదానంబు" వీడి ♦ కంటె కుమారా ॥ ౨౧

క॥ ఒరులుహాసించెడు వేళను
పరులుయులక్ష్యముగ మీరి ♦ పలికెడు వేళన్
యరులు నినుదూరు వేళను
గురుతరశాంతంబు మదిని ♦ గొనుము కుమారా॥ ౨౨

క॥ క్రోధము సద్గుణశత్రువు
క్రోధమ్మున చిత్తశాంతి ♦ గుదురదు ధరణిన్
క్రోధమున బుట్టుక్రూరత
క్రోధము సాధువులయొనుట ♦ గ్రుంగు కుమారా

క॥ తనక్రోధము ఘనశత్రువు
తనశాంతము ప్రియహితుండు ♦ తలపోయంగన్
తనదుర్ధ్యానము పాపము
తనసద్భావంబు పుణ్య ♦ తమము కుమారా॥ ౨౩

క॥ చీమను దోమను పేనను
పామును వృశ్చికము నల్లి • పాపమునకు ని
వేమాత్రము హింసించిన
భూమిని నరకంబు నిన్ను • పొందు కుమారా॥ ౨౩

క॥ కరుణింపు మఖిలజంతుల
కరుణింపుము విప్రజాతి • గణముల నెల్లన్
కరుణింపుము దీనులమొర
కరుణింపుము శత్రువులను • గనిన కుమారా॥ ౨౪

క॥ దురితంబని తలపోయక
నిరతంబును భువినిజంతు • నికరంబును ము
ష్కరుడై హింస నొనర్చిన
నరుడు పరమ పాతకుండు • నమ్ము కుమారా॥ ౨౫

క॥ తనయందును పరులందును
జనులందును సకలజంతు • జాలములందున్
కనుగొనగ ఆత్మయొకడని
మనమున దెలిసికొని హింస • మాను కుమారా॥

క॥ విద్యయొసంగును వినయము
విద్యయొసలిగించు పరమ ♦ విజ్ఞానంబుల్
విద్యయె శ్రీయంబిచ్చును
విద్యయెశిరులిచ్చు "పరుసవేది"కుమారా॥ ౨౮

క॥ చదివినవాడు సుపూజ్యుడు
చదివినవాడఖిలమును ♦ సచ్చరితుడగున్
చదివిన వాడగు సదయుడు
చదువనివాడంధుడసగ ♦ జనును కుమారా॥ ౨౯

క॥ పరునైన బంధునైనను
నిరుపేదలనైన భాగ్య ♦ నిలయులనైనన్
ధరపంచమునైనను భూ
సురునైనసమాన దృష్టి ♦ జూడు కుమారా॥ 30

క॥ పరమతముల ద్వేషింపకు
పరమతధర్మముల చెడుగు ♦ పలుకకుమెపుడున్
పరమతము లెన్నియున్నను
పరమున కేతోవలంచు ♦ పలుకు కుమారా॥ 3౧.

క॥ లోకంబందలి విధిగా
నేక జనులలో మనము లనేకములగునన్
వాక్యంబగు వేదము
నేకాగ్రమ్ముతో మెలంగు • మెప్పుడు కుమారా ॥ 32

క॥ కలియుగమున సంఘమున
కలదు మహాశక్తి యనుచు • గమనించి మహిం
గల జనులొకే సంఘంబున
కలసి ప్రవర్తింప మేలు • కలుగు కుమారా॥ 33

క॥ పరులన్ కృపగనుచుండుము
పరజనములతోడ ప్రేమ • భాషింపుమిలన్
పరనింద సేయబోకుము
పర మత సహనంబు కలిగి • బ్రతుకు కుమారా।

క॥ జనవాక్యమె కర్తవ్యం
బనియెడు నార్యోక్తి మనము నందుంచి మహా
జనుల యభిప్రాయంబుల
కనుకూలుడవై జరింపు • మవని కుమారా॥ 34

క॥ చలిచీమయందు, దంతా
వళమందు ఫణీంద్రునందు • బ్రజలాదులను, వి
ప్రులయందు, మాలలందును
గలడల పరమాత్ముడొక్క • గతిని కుమారా॥

క॥ పరుల ధనంబు హరించుచు
పరమాన్నము గుడిచి సౌఖ్య • పడుటకంటె, యశ
స్కరమై కష్టార్జితమున
తిరవాణిగుడువ శ్రేష్ఠతమము గుమారా॥ ౩౨

క॥ నరుడైనను, గురుడైనను,
ధరణీశుండైన, దైవ • తముడైన, ధరా
మరుడైనను, సోమరియై
పరకష్టము దినెడువాడు • పాపి కుమారా॥ ౩౩

క॥ ధనదుని పుత్రుండైనను
జననాథుని సూనుడైన • శ్రమకోడక తా
నసిశము కష్టార్జితమును
దిని బ్రతుకుట శ్రేష్ఠమెన • తెరవు కుమారా॥

క॥ అరువుగొని తెచ్చి దిసియొసు
పరమాన్నముకంటె కష్ట ♦ పడి నిరతంబున్
తిరవాణిదారియైనను
పరితృప్తింగనుట ధర్మ ♦ పథము కుమారా॥ ౧౦

క॥ శిరులున్న, ధైర్యమున్నను
పరువున్నను, బంధువున్న ♦ పటుబలమున్నన్
సిరులున్న, నగరులున్నను
ధరయున్నను, గర్వపడుట ♦ తగదు కుమారా॥

క॥ ధనమింత నాకు గలదని
తనువు మరచి, విర్రవీగు ♦ ధనవంతులకై
దినమున్నదొకటి, వారల
ధనగర్వమణంపగలది ♦ తలప కుమారా॥ ౧౨

క॥ గర్వంబు కనుల గప్పును
గర్వము తన దోషములను ♦ గననీయదిలన్
గర్వము దుష్కర్మంబగు
గర్వము దుర్గుణము చేర్చు ♦ గలదు కుమారా॥ ౧౩

క॥ గురులకు, సద్గుణవరులకు,
వసువు పవిత్రులకు, దేశ • భక్తులకు, యతీ
శ్వరులకు హాని యొనర్చెడు
నరుడు మహాపాపియగును • నమ్ము కుమారా।

క॥ మితిమీరుచు భాషించుచు
నతిగా భూషించు నతిపి • యమ్ముగ బల్కుఁ
అతివినయము ప్రకటించుచు
అతిడంబము జూపు కుజను • డవని కుమారా॥

క॥ నమ్మకము జూపుచును, విన
యమ్మున బల్కుచును స్నేహ•మందున ఖలులై
యమ్మహా మిత్రద్రోహము
సమ్మతితో జేయుచుందు • జనులు కుమారా।

క॥ జాగరణంబొనరించిన
ధీరత నశియించు నాత్మ • తేజము తగ్గుఁ
గూరిములగు రోగంబుల
బారింబడి చెడును దేహ • బలము కుమారా। ర:

క॥ ధనమా నాశమునొందను
ఘనమా యస్థిరత నొందు మానము చెడు భూ
జన నిందచుట్టుకొను, దు
ర్జనుడై జారత్వమింత • నలుప కుమారా॥ ౪౮

క॥ జననీజనకులు వగతురు
ఘనబంధువ్రులైన వేగిమ • గనరు స్వకాంతల్
మనమున కడు చింతించెద
రనయము జారులగు జనుల • నరసి కుమారా॥

క॥ పరనారీలోలుండయి
నిరతము చరియించు పరమ • నీచుడు చెఱచున్
పరమ పవిత్రము నను యశ
స్కరమగు నిజకులము నెన్నకడువు కుమారా॥ ౫౦

క॥ పరతరుణీ సంగమాడయి
బరగుచు దుర్వ్యసనముగొనుచు • బ్రతుకుట కంటెన్
పరుగిడి యొకనూతంబడి
మరణించుట వరము నుత్త • మంబు కుమారా॥ ౫౧

క॥ వరియింపకు పరకాంతల
స్మరియింపకు భక్తిలేక • సర్వజనేశున్
చరియింపకు సోమరివై
హరియింపకు పరధనంబు • లవని గుమారా॥ ౨

క॥ సారాయము శివలూమృను
సారాయము మైమరపును • చయ్యన దెచ్చున్
సారాయము ఖేదఁజేయును
సారాయము ద్రాగువాడు • జముడు కుమారా॥

క॥ త్రాగిన గౌరవముడుగును
త్రాగిన కారణము లేని • క్రౌర్యము హెచ్చున్
త్రాగిన నో దేహముసెడు
త్రాగిన నబ్బిబ్బుగలుగు • ధరణి కుమారా॥ ౪౧

క॥ త్రాగిన పరపతి భంగము
త్రాగిన జనునెల్లజనులు • దయజూపరిలన్
త్రాగు నరు డెప్పుడు నమ్మరు
త్రాగుడు శివలూమృకీడు • దాల్పు కుమారా॥

క॥ సారాయంబును ద్రావిన
సారాయము విక్రయంబు • సలిపిన మఱియా
సారాయము ద్రావించిన
గౌరవభంగంబు నీకు • గలుగు కుమారా॥ ౫౭

క॥ జరయును మృతియును లేదని
కరములరగ ధనము విద్య • గడియించవలెన్
మరణింతునంచు ప్రాజ్ఞుడు
ధరపై పేరును నొసగ • తగును కుమారా॥ ౫౮

క॥ జననీజనకుల నిత్యము
వినయమ్మున భక్తవరుని • విధమున ప్రేమన్
గని సేవించునతండే
ఘనుడు యశోధనుడు క్షేమ • కరుడు కుమారా॥

క॥ ధర్మాధర్మంబులగల
మర్మంబులనెల్ల దెలిసి • మాన్యుడవై స
త్కర్మంబులాచరింపుము
నిర్మలమతి కాంక్షలేని • నియతి కుమారా॥ ౫౯

క॥ పనిలేకను తినలేను
ఘనలేక కృశించుజనుల • మానచుటకంటెన్
దినదినము తులసిపూజలు
పెనవేసిన ఫలము రాదు • పెద్ద కుమారా! ౬॥

క॥ తన కీశ్వరుండొసంగిన
ధనమున నిరుపేదలకు సదా ధర్మంబుల్
కనికరముతో నొసంగెడు
జనుడు "దయామయుడనంగ" • జనును కుమారా!

క॥ తనధనము తనమనంబును
తనదేహము తనకుపేరిమ • తన జీవితమున్
జనములు సేవించుటకై
వినియోగించుటయె సుజను • విధము కుమారా!

క॥ పదుగురను గౌరవించుచు
పదుగురిచే గౌరవంబు • బడయుచు క్రమమున్
పదుగురకు నచ్చ జెప్పుచు
పదుగురి సేవింపవలెను • పరము కుమారా! ౩౬

క॥ దయఁజూపు మెల్ల జనులను
దయ జూపినవారు నిన్ను ♦ దయఁజూతురొగా౯
దయఁజూపకున్న నీపై
దయఁజూపరు పాపమెన ♦ దలఁచి కుమారా! ౬౪

క॥ ఆదరణలేక పెట్టెడు
సాదము పరమాన్నమగుచున ♦ చవిగలదె? భువి౯
సాదరముగా నొసంగు వ
సాదము జొన్నైన ముదమొ ♦ సంతు కుమారా!

క॥ కరుణింపుము నిరతము సా
దరముగ యంధతను కుంటి ♦ తనమున పిచ్చ౯
జరచేత వ్యాధిచేతను
గరము కృశించెడు జనాళి ♦ గనిన కుమారా! ౬౬

క॥ పలువతనంబున నిత్యము
పలుగాకులతో చరించు ♦ పాపుల హృదయం
బులు నిరతము సజ్జన సే
వలు చేసినగాని బాగు ♦ పడవు కుమారా! ౬౭

క॥ పాలకులనవరతంబును
పాలితులను తృప్తిపరుప • పాలన పాగుఁ
పాలితుల కసహ్యంబగు
పాలనమెటునిల్చు నెటుల • ప్రబలు కుమారా॥

క॥ పాలితుల కష్టములఁ భూ
పాలురు దొలగించి ప్రేమ • బాలింపదగుఁ
పాలితులు భక్తిసల్పరి
పాలకులను గొల్వ ధర్మ • పథము కుమారా॥

క॥ స్వాతంత్ర్యము గురుసంపద
స్వాతంత్ర్యముఁగొనుట జనుల • సద్ధర్మముగుఁ
స్వాతంత్ర్యము స్వారాజ్యము
స్వాతంత్ర్యము జన్మహక్కు • జగతి కుమారా॥

క॥ పరులకు దాస్యమొనర్చుట
పరదాస్యము సేయు ఘోర • పాతకమబ్బుఁ
పరదాస్యము పశుకృత్యము
పరదాస్యము యస్వతంత్ర • పథము కుమారా॥

క॥ దాస్యమున కిచ్చగింపకు
దాస్యము నీయంగనీకు ◆ ధర్మంబు చెముర్
దాస్యము స్వేచ్ఛాశత్రువు
దాస్యంబిల మానవులకు ◆ తగదు కుమారా॥2

క॥ కోరార బల్కుటకు మన
సార జరించుటకు నీకు ◆ నవ్యాయుపరముల్
జేరి భజించుటకైనను
దీరను శాసనలెక్క ◆ దినము కుమారా॥ 3

క॥ అర్ధంబరయక చదువుట
వ్యర్థము క్రియలేని వంతు ◆ వ్యర్థము సాగా
తాత్పర్థము పరయూచించుట
వ్యర్థంబని మదిని నమ్ము ◆ వలయు కుమారా॥

క॥ తిట్టకుమెవరిని వేసట
పెట్టకు దుర్జనునియైన ◆ పెద్దలవంకన్
బెట్టకు సామునై నీ
పొట్టకు దినదినము వెతుక ◆ బోకు కుమారా॥2

క॥ నమ్మకుము జారచోరుల
నమ్మకు మనృతంబు పలుకు • నరులను మఱియున్
నమ్మకుము త్రాగుబోతుల
నమ్మకుమిల జూదగాండ్ర • నడత కుమారా॥ ౨౧

క॥ పరనింద యాత్మభావన
పరద్రవ్యాపేక్ష పరుల • వంచించుటయున్
పరసేవ మోర్వకుండుట
ధరణిని సద్వర్తనునకు • తగదు కుమారా॥ ౨౨

క॥ మితభాషిత్వము సతతము
మిత మొప్ప భుజించుటయును • మిత సంతసముల్
మితనిద్ర గాంచుటయు నీ
క్షితితలమున సజ్జనులకు • జెల్లు కుమారా॥ ౨౩

క॥ జారుండై చోరుండై
క్రూరుండై భూతలమున • కుటిలాత్ముండై
ధీరుండై సుతుడుండిన
తీరని శోకమున తండ్రి • తెల్లు కుమారా॥ ౨౪

క॥ చెప్పఁగలవాని వెంటను
అప్పఁగలవానివెంట ♦ నరుగకు మఱుగా॥
ముప్పు ఘటిల్లును పిమ్మట
తప్పెరిగి విచారమంద తగునె కుమారా॥ ౮౮

క॥ చింతింపకు శ్రీమలోఁకవిన
సంతసమున గర్వపడకు ♦ సౌఖ్యమొదవిన౯
మంతువుచెడి నమ్మకు మా
వంతయు దేహంబుస్థిరము ♦ టంచు కుమారా॥ ౮౯

క॥ ఘన సుకృతిశ్రీయుక్తైనను
తన రాజ్యమ్ము నందె పూజ్యతను ♦ గాంచుమహి౯
ఘన విద్వాంసుడు పూజ్యతఁ
గనునే దేశమున నైన ♦ శ్రీమత కుమారా॥ ౯౦

క॥ తన తప్పు తానెరుంగుట
ఘనులకు సుమతులకు దక్క ♦ ఖలులకు వశమే
తనమదిని పరుని చెడుగుల
గను జనుడు స్వదోషములను ♦ గనునె కుమారా॥

క॥ తెలియక జేసిన దోషము
తెలిసికొనిన పిదప మిగుల • దీనుండై చిం
తిలి పశ్చాత్తాపముతో
మెలగిన నశియించు కలుష • మెల్ల కుమారా!

క॥ పరమ ప్రశాంతచిత్తము
నిరతము సూనృతము ధర్మ • నిరతి యుక్రృప యున్
పరమేశు భక్తిగలిగిన
నరుడే బ్రాహ్మణుడటంచు • నమ్ము కుమారా!

క॥ గుణవంతుని ఘనహృదయము
గుణపూరితమగుచు పేరు • గురియుచునుండున్
గుణహీనుని హృదయము దు
ర్గుణ సంయుతమైన రాళ్ళ • గుట్ట కుమారా!

క॥ గోనముకలవాని స్నేహము
గోనవచ్చును రూకలిచ్చి • గుణహీనునితో
గనుచుండెడు సాంగత్యం
బును మానుము కానులైన • బోసి కుమారా!

క॥ నిస్సంగ సత్సాంగమున
నిస్సంగత్వంబు గుదురు • నిజముగ లభించున్
దుస్సాంగత్య మొనర్చిన
దుస్సహమగు దుష్కృతంబు • తొడరు కుమారా॥

క॥ దుస్సాంగత్యము దుష్టము
దుస్సాంగత్యంబు సుజను • దుర్జను జేయున్
దుస్సాంగత్య మొనర్చియు
శస్త్రం గోల్పోవనీకు • జనను కుమారా॥ ౨౯

క॥ శిరిగల తరుణంబున నం
దరు బంధుగులగుదురవని • దారిద్ర్యముచే
కరము కృశించెడు వేళల
వరులగుదురు బంధులెల్ల • వరుస కుమారా॥ ౩౦

క॥ నెమ్మదికుజనుల నమ్మకు
సమ్ముఖమున పొగడనమ్మి • చరియింపకు భో
గమ్ముపయి నాసలిక నీ
వమ్మను దుర్వ్యసనముగనకు • జగతి కుమారా॥ ౩౧

క॥ కోరకుమీ పరధనమ్ముల
దూరకుమీ శత్రువులను • దుర్జనులైనన్
జేరకుమీ దుర్మార్గుల
కూరకుమీ భోజనంబు • కుక్షి కుమారా! ౬౨

క॥ వేడకుమీ గుణహీనుల
వీడకుమీ ప్రియహితులను • వీసంబున్ నీ
వాడకుమీ దుర్భాషల
కూడకుమీ పరసతులను • కూర్మి కుమారా! ౬౩

క॥ పోషింపుము దీనుల న
న్వేషింపుము దీక్షబూని • నీతజ్ఞుల సం
తోషింపుము నిరతము సం
భాషింపుము సుజనవరుల • ప్రజ్ఞ కుమారా! ౬౪

క॥ పరమ కిరాతుం తోడను
పరధనముల మ్రుచ్చిలించు • పాపుం తోడన్
పరనారీలోలురతోన్
జరియించిన చేటుగలుగు • సరగ కుమారా! ౬౫

క॥ కనవలె సద్గ్రంథంబుల
వినవలె పరమేశు కథల • వీనుల తోడన్
మనవలె గౌరవయుతముగ
చనవలె సన్మార్గమునను • జనులకు కుమారా॥ ౧౬

క। కష్టములు గలిగినను ధన
నష్టంబే ప్రాప్తమైన • న్యాయంబని వి
స్పష్టంబగు కార్యము నీ
విష్టంబుగ నాచరింపు • మిలను కుమారా॥ ౧౭

క॥ ఆరోగ్యంబును మరువకు
మారోగ్యంబున్న నరున • కాయు నధికమౌ
నారోగ్యశీలు జీవన
మారయ సుఖమయము భూమి • నుండు కుమారా॥

క॥ పతియెడల సుతులయెడ పిత
తతులెడలను బంధులెడల • సలిదంపు ప్రేమన్
క్షితిపై ననురాగాన్విత
మతివై సంతసము మీర • మనుము కుమారా।

క॥ కమురైన కవ్యమైనను
కుదురుగ వ్రాశింపసిరికి • గొమవమొ? నవ్వో
మొదలను దరిద్రదేవత
కదురునుకవ్యంబునిచ్చు • కలిమి కుమారా॥౧౦౦
క॥ సకల జనులకును నీకును
సకలుఱ శ్రీయాజ్ఞవల్క్య • సన్ముని కృపచే
సకలం బుపదేశించితి
సకల శుభప్రాప్తిగలుగు • సరణి కుమారా॥౧౦౧
క॥ ధాత్రీస్థలి నాత్రేయస
గోత్రజుమను మునగపాటి • కులజుడు వ్రాసెన్
పాత్రుడు శ్రీకాత్యాయన
సూత్రుడు చిన హనుమయాఖ్యుడు • కవి కు॥౧౦౨
క॥ భక్తిగ నీ శతకంబను
రక్తిగ జదువుచును వినుచు • వ్రాయుచు నిరతిన్
శక్తికొలది వర్తించిన
భుక్తియు ముక్తియును కలుగు • భువిని కు॥౧౦౩

—* సమాప్తము *—

☞ వలయువారు :—

మునగపాటి చిన హనుమయ్య,

మునగపాడు,

పాతులూరు పోష్టు,

గుంటూరు జిల్లా.

